ఉ. కామితదానకల్పలతికావనసీమ సమస్తభక్తసు
క్షేమకృదాత్మనామ తతకీర్త్యభిరామ యవార్యదోర్బ్యగ
స్థేమ విపద్విరామ తులసీ గుళికాన్వితదామ నమ్రసు
త్రామ కుభృల్లలామ రఘురామ. ౫

ఉ. అక్షపదాఖ్యమానివనితాస్వభిరక్షణదక్ష ఘోరదై
త్యక్షయకారిభూరిభయదాహవదీక్ష యశేష దైవతా
ధ్యక్ష విలక్షజీవనరుహాక్ష జితాక్ష విపక్షహస్తిహా
ర్యక్ష కృపాకటాక్ష రఘురామ. ౬.

ఉ. దారుణజన్యభీతజముదగ్నికుమార నమజ్జనచ్ఛటా
ధార విశిష్టశిష్టజనతాపవిదార యపారసత్కృపా
సార ఖలావళీక్షపణచండకఠోరకుఠారధార సు
ర్వారశరప్రచార రఘురామ. ౭.

ఉ. మేరుసుధీర పాలితసమీరకుమార త్రిలోకసుందరా
కార వికుంఠవిస్ఫురదగాధదృఢీకృతదండకాఖ్యకాం
తారవిహార కంఠసముదంచితహార పయోధిరాడ్గభీ
రా రణరంగశూర రఘురామ. ౮

ఉ. ఆహితతార్క్ష్యవాహ సముదగ్రఘనాసునదేహ సంతతో
త్సాహ జహద్దురూహ రణశామ్య దరాతిసమూహ భూసుతో-
ద్వాహ నిరుక్తమోహ నిజవత్సకవత్పరిణాహ వాలిని
గ్రాహకతాంచదీహ రఘురామ.

ఉ. భాసురహేమవాస హిమభానువికాసితమందహాస వి
శ్వాసచరిష్ణుదాస వరచంపకకోశసమాననాస ప్రో
ల్లాస రసాస్వదానన విలాసవిదారిత సజ్జనావళీ
త్రాస జగన్నివాస రఘురామ. ౧౦.

ఉ. నీతికళావిశారద మనీషిజనంబు భళీ యనన్ నయ
ద్యోతకశాస్త్రరీతి దగ నుత్పలచంపకవృత్త యుక్తమై
ఖ్యాతిగ నీదుపేర శతకంబు రచింతు సుధారసోరుధా
రాతులితోక్తు లొప్ప రఘురామ. ౧౧.

ఉ. భూతలమందు దోషికిఁ దపోనిధులైన మహాత్మసంగతిన్
బాతకముల్ దొలంగి మది వాంఛలు నేమగు నెట్టులన్న ధా
త్రీతనయేశ నీదుపదరేణువు సోకిన నయ్యెగాదె మున్
రాతికి నాతిరూపు రఘురామ. ౧౨.

ఉ. నీతి వివేకసంపద జనించిన మర్త్యునిబుద్ధి నిర్మలం
బై తనరారుచుండు నెటులన్న శరన్నవపూర్ణిమాశశి
స్ఫీతకళాకలాపముల జెన్నలరారెడు నిండువెన్నెలన్
రాతిరి యొప్పునట్లు రఘురామ. ౧౩.

ఉ. వేగముచే హయంబును సువృత్తముచే సతియుక్ మదంబుచే
నాగము సూర్యుచేత గగనంబును చంద్రునిచేత రాత్రియున్
త్యాగముచేత గీర్తి నది హంసలచే శ్రుతిమేళనంబుచే
రాగమ్ము బాగుగాంచు రఘురామ ౧౪.

ఉ. శ్రీలలితోక్తులన్ గృతి రచించుతటిన్ ఘనమౌకవిక్రమున్
బాలిసుఁడే మెఱుంగు గవిచర్యుడె గాక సుతాళిగన్న యి
ల్లాలె యెఱుంగుగాక ప్రసవాగతగర్భవతీశ్రమంబు గొ
డ్రాలది యే మెఱుంగు రఘురామ. ౧౫.

చ. లలితధనపూర్ణుడైన నెరదాతయు సుందరరూపయౌ పతి
వ్రతయును జ్ఞానియైన సువిరక్తుడు సంగరరంగధీరమౌ
చతురతురంగమంబు సదసద్వివేకుఁడౌ ప్రభు వుర్వినొప్ప నీ
రలినప్రపంచకంబు రఘురామ. ౧౬.

చ. సమయమునన్ స్ఫురించుటకు జాలనివిద్యయు కాననప్రదే
శమున వెలుఁగు వెన్నెలయు శాస్త్ర మెఱుఁగని వైద్యుడున్ రణ
క్షమునెదిరింపలేని భుజశక్తిపటుత్వము రాజులేని రా
ష్ట్రమును నిరర్థకంబు రఘురామ. ౧౭.

చ వినయముతోఁ జనుల్ వినని భృత్యుఁడు శాంతివిహీనమౌ తపం
బును రమణుండు లేని విరిబోణులజవ్వనమున్ వివేకమూ
నని నెరదాతయీవియు మనంబున భక్తిని యుక్తిలేని య
ర్చనమును వ్యర్థమౌను రఘురామ. ౧౮

చం. పలుమరు నన్యగేహముల బత్తిబనాలును పాలనస్థితిం
దెలియనిసంభినిధవులిదేశము గాపరిలేని చేనిపం
టలు నొగి త్యాగభోగము లొసర్పనివానిధనంబు లాత్మివా
రలకు నధీనమౌను రఘురామ. ౧౯

చం. సుమహితదానధర్మపరిశోభితుఁ డై తగువానిసన్నిధా
నమునను బండితోత్తము లనారతముఖ్యరహిం జేరుచుండు రా
సుమితరసాలసాల నవసూనమరందరసానుభూతికై
భ్రమరసమూహ మట్లు రఘురామ. ౨౦

ఉ. ఆలమునందు నోడక జయావహుఁడౌ పడవాలు రమ్యహా
ర్మ్యాళి జెలంగు ప్రోలు ననయంబును దాన మొనర్చుకేలు సం
శీలత న్యాయమార్గమున జేకొనుపాలు నిశాతధారచే
గ్రాలెడువాలు మేలు రఘురామ. ౨౧

ఉ. డాలు గడుం దనర్చు పవడాలు ధగద్ధగితంబులైన య
ద్దాలును గొప్పలైన యరదాలు వినిర్మలకాంతు లొల్కు ము
త్యాలసరాలు నిష్టసరసాన్నము లెప్పుడు బెట్టునట్టి స
త్రాలును మేలునొందు రఘురామ. ౨౨

ఉ. శ్రీలఁ జెలంగుపంటగల చేలు విపద్దశ దీర్చునట్టి చు
ట్టాలు జయంబు దాల్చినసిడాలు శుభధ్వనిమించఁ బ్రోయు భే
రీలు సదా బుధాళినలరించు గొనాలు విశాలమైన నే
త్రాలును మేలు గూర్చు రఘురామ. ౨౩.

చం. విమలగుణప్రవర్తనవివేకము లబ్బినపుత్రి సర్వస
స్యములు ఫలించుధాత్రి దనుజారికి వాహనమౌపతత్రి కృ
త్రిమములులేనిమైత్రియు ధరిత్రిని గొమ్మున మోయుపోత్రి స్తో
త్రములను గాంచుచుండు రఘురామ. ౨౪.

చం. సలలితనీతివాక్యముల సద్గుణశాలి యుపన్యసింపఁగా
ఖలు లవి యాలకించి కినుకం గలహింతు రదెట్టులన్న కో
కిలరచియించునాదము లాగి న్విని వాయసపాళి దాని ని
ర్దళనము సేయబూను రఘురామ. ౨౫.

చం. తినను నసాధ్యవైరిగల తావున దాను నిమేషమాత్రమై
నను నిలువంగ నాపవ దనర్చు మదేభము సత్వశాలియై
నను బహుళార్తినొందదె విన్నబలోన్నతయై మృగేంద్ర ద
ర్శనమగునట్టిచోట రఘురామ. ౨౬.

చం. అమరు విపత్తి భూరిసుకృతాత్మున కల్పప్రదోషము త్తిచే
నమితములయ్యు బాపము లఘాత్మునకొగ్గు ఘటింప వావుమూ
త్రముపడినంతమాత్రమున దప్పక పాల్ చెడుగాని యట్లు త
క్రము చెడిపోను నూవె రఘురామ. ౨౭.

చం. కృపణునకున్ ధనప్రకర మెంతయుఁగల్గిన నర్థికోటికై
యుపకృతినొంద రెట్లనిన నోర్వగరాని పిపాసగొన్న పాం
థపటలి కిం పుగాని సముద్రగతరంగ చయోల్లసత్సము
ద్రపుసలిలంబుమాడ్కి రఘురామ. ౨౮.

చం. వితరణశాలి కల్పమగు విత్తము గల్గిన యాచకాళికిన్
సతతము సంతసంబున నొసంగుచు గీర్తి వహించు నెట్లనన్
హితమసతోయముల్ చెలమ కించుక కల్గిన సర్వజంతువుల్
బ్రతుకగజేయునట్లు రఘురామ. ౨౯.

ఉ. ఆకొని యున్న మర్త్యునకు నన్న మొసంగిన నాతఁ డప్పుడే
చేకొని యాదరంబున భుజించు దరిద్రున కర్థమిచ్చినం
గైకొను నట్లు సాదరముగా ధనవంతున కీయ వ్యర్థమౌ
పాత్రికలకీర్తిసాంద్ర రఘురామ. 30.

చం. పెనుపగు శ్రద్ధ నెల్లపుడు వేముని కిక్షురసంబు వోసి పెం
చినను దదీయ తిక్తత నశించునె మాధురి దానికబ్బునే
ఘనతరధర్మశాస్త్రపు బరికారములన్నియుఁ దెల్పినేని దు
ర్జనునకు బోధ మౌనె రఘురామ. 3౧.

ఉ. ఇమ్ముగ వంశమందు నొకఁడేని గరిష్ఠుఁడు సంభవింప వం
శమ్మున కెల్ల యోగ్యత ఘటించు నరణ్యమునం బటీర వృ
క్షమ్ము జనించెనేని ఘనసౌరభ మవ్వనమందు నెల్లెడం
గ్రమ్మినరీతిగాఁగ రఘురామ. 3౨.

ఉ. నీచుని తోడు తన్ ఘనుడు స్నేహ మొనర్చిన నప్పుడాతడుం
దోచును నీచునట్లుల గ దుగ్ధపు భాండము శౌండినీగతం
బై చనినం జనంబులకు నాత్మల బోపల మద్యమట్లు గా
బ్రాచురినొందు రీతి రఘురామ. 33

చం. గుణనిధియౌ మహోన్నతుని గొల్చెడివారలు గాంచుచుండ్రు త
ద్గుణగరిమంబు గంధగిరికూటమునం గుటజాదివృక్షపుం
గణములు చందనద్రుమసగంధము లొందు సమున్నతాకృతిం
బ్ర[illegible]తి వహించినట్లు రఘురామ. ౪3

ఉ. రూపము ప్రాపు వేశ్యలకు రొక్కము ప్రాపు విదేశగామికిన్
జాపము ప్రాపు యోధులకు శాంతత ప్రాపు తపస్వికిన్ నిశిన్
దీపము ప్రాపు చూపున కదృష్టవిశేషమె యెల్లవారికిం
బ్రాపగుచుండు నెంచ రఘురామ దయాహృదయా శుభోదయా ౨౫.

ఉ. సాదరమైన పెట్టు సుఫలావళిగల్గినచెట్టు పుణ్యసం
పాదకమైన పుట్టు నుతిపద్ధతి నేర్చిన భట్టు వైరికిన్
భేదిలకున్న గుట్టు సిరిపెంపుఁహించిన మన్కిపట్టు మ
ర్యాదల బిట్టుజెందు రఘురామ దయాహృదయా శుభోదయా ౨౬.

ఉ. సత్యము తల్లియై బరగు జ్ఞానము తండ్రియగున్ సహోదరుం
డత్యురు ధర్మమై తనరు నాప్తుఁడు సత్కృప యౌను శాంతియే
నిత్యము పత్ని యౌను క్షమ నిస్తుల పుత్రుడు నౌ నటం చెదన్
బ్రత్యహముండలంతు రఘురామ దయాహృదయా శుభోవయా ౨౭.

చ. తనజనయిత్రిభంగి పరదారల నెల్లను లోష్టసంచయం
బునుబలె నన్యవిత్తగణమున్ సచరాచరభూతపుంజ మా
త్మనువలె గాంచు నేవరుఁ డతండె పరాత్పరుఁడైన బ్రహ్మ ద
ర్శన మొనరించువాఁడు రఘురామ దయాహృదయా శుభోదయా ౨౮.

ఉ. క్షామమునందు నన్నమునొసంగెడువాఁడు సుభిక్షవేళలన్
హేమము నిచ్చువాఁడు ఋణమించుక యైనను లేనివాఁడు సం
గ్రామమునందు ధీరుఁడు జగంబున వీరలు నల్వురున్ నర
గ్రామణులంచు నెంతు రఘురామ దయాహృదయా శుభోదయా ౨౯.

ఉ. అంబువు వాహినీ సముదయంబున కౌను బ్రధాన మెల్ల గా
త్రింబునకుం బ్రధానము శిరంబగు నారగు చాలకుం బ్రధా
నంబుగ నుండు నెప్డు లవణం బఖిలేంద్రియపాళి కెన్న నే
త్రింబు ప్రధానమౌను రఘురామ దయాహృదయా శుభోదయా ౫౦.

చం. మతి దలపోసిచూడ శ్రుతిమాతృకకంటె బ్రశస్తమంత్రిముఙ్
సతతము నన్నదానసదృశంబగు దానము తల్లికంటె దై
వతమును పుణ్యదంబయిన ద్వాదశికంటెను శ్రేష్ఠమైన సు
వ్రతమునులేవు సుమ్ము రఘురామ దయాహృదయా శుభోదయా ౫౧.

చం. మన్నొకటేతనర్చును సమస్తసమంచిత భాండరూపమై
పొన్నొకటేతగున్ బహువిధోజ్వల భూషణరూపభేదమై
యెన్నగ నాత్మయొక్కఁడె యనేకశరీరములందు దైలువా
రన్నిలుచుఙ్ సతంబు రఘురామ దయాహృదయా శుభోదయా ౫౨.

ఉ. సాంద్రమైన కన్ను కమలాప్తు ప్రకాశముగల్గు మిన్ను వ
న్నెంజిగిహెచ్చు పొన్ను తరుణీత్వము గల్గినయన్న సర్వసా
మంజసమైన పన్ను గిరివంకర యొగలులేని జన్న స
ద్రంజనముఙ్ ఘటించు రఘురామ దయాహృదయా శుభోదయా ౫౩.

శం. శుచిశుచియయినవంట గుణరూపవిశేషములున్నదంట భూ
మిచలువ నొప్పుపంట ధ్వని మేలుగ గల్గిన గంట మంచినీ
టిచెరువుగుంట దానముకడిందిమగంటిమి గల్గియుంటయుఙ్
బ్రహసరయశంబుగాంచు రఘురామ దయాహృదయాశుభోదయా. ౫౪

చ. రమణీయము పుస్తకంబు ధనరాశియు నానివి మూఁడునన్యహా
స్తమున గతంబులైనను గతంబులె యౌ నవి క్రమ్మరం బ్రా
ప్తములగునట్టికాలమున భ్రష్టయు, జీర్ణము నల్పమైనవై
క్రమమునచేరుసుమ్ము రఘురామ దయాహృదయాశుభోదయా. ౫౫

చ. ద్రవిణము మంత్రమర్మమును దానము మానము గేహకృత్య మా
యువు నవమానముం గిసలయోష్ఠిసమాగమ మౌషధం బనం
గ వెలయుచుండునట్టి నవకంబును దాచ నగుఁ సుధీజన
ప్రకరము దలంప రఘురామ దయాహృదయా శుభోదయా. ౫౬

చ పడిగనుబుద్ధి హెచ్చు ఘృతపాన మొనర్చుటచేత నాయు వె
క్కుడగుచునుండు క్షీరములు గోర్లుటచేతను వ్యాధి హెచ్చుగుఁ
గడుకొని శాకముల్ మెసవగం గటుభుక్తి యొనర్పఁ గోపమే
ర్పడఁ బ్రబలించుచుండు రఘురామ దయాహృదయా శుభోదయా. ౫౭

ఉ. నర్జితదోషుఁడౌ నరు ధనమ్ము తటిఁ గురి దాకు నమ్ము న్యా
యార్జితమైనసొమ్ము సిరులందిమనందగునిమ్ము నీటిచే
నూర్జితమైనదమ్ము గడునున్నతమై వెడదైన రొమ్మునుం
బ్రాగ్జనమొందునమ్ము రఘురామ దయాహృదయాశుభోదయా. ౫౮

చ. తనయుని పంచవర్షములు దాక గనందగు రాజపుత్రుచా
ట్పున పిదపన్ దశాబ్దములు బొందినదాకను భృత్యరీతిగా
గనదగు షోడశాబ్దములు గాంచినమీదట మిత్రధర్మవ
ర్తనమునఁజూడనొప్పు రఘురామ దయాహృదయా శుభోదయా. ౫౯

ఉ. యుక్తినివాదమొప్పును నియుక్తిని బ్రాభవ మొప్పు సత్క్రియా
సక్తిని బుణ్యమొప్పు భుజశక్తిని సాధనమొప్పు దేవతా
భక్తిని మోక్షమొప్పు క్షుధ భాసిలుభుక్తిని సత్వమొప్పు బ
ల్రక్తిని గానమొప్పు రఘురామ దయాహృదయా శుభోదయా. ౬౦

ఉ. స్నానముచే శుచిత్వము ప్రసంగవిధానముచేత విద్య స
న్మానముచే మహాత్వ మభిమానముచేతను గోపముఁ దృఢ
జ్ఞానముచేత సద్గతియు సత్యవితానముచే సుఖోన్నతుల్
రానగుచుండు సుమ్ము రఘురామ దయాహృదయా శుభోదయా. ౬౧

ఉ. అంబునిధిన్ మథించు సమయంబున శంభున కల్లకాలకూ
టంబు లభించె శౌరికి దృఢంబుగ లక్ష్మి లభించెఁ గాన భా
గ్యంబె ఫలంబుగూర్చు నటుగాక సమంచితవిద్యయున్ స్వశౌ
ర్యంబును గూర్ప లేవు రఘురామ దయాహృదయా శుభోదయా. ౬౨

ఉ. పాత్రమునొందు నీవి జనవర్ధకమైతగు దీవి సత్పయ
స్సత్రముగల్గు బావి స్మితశోణతలందగు మోవి సాంద్రతం
బత్రఫలాది రమ్యమగు మావియు వేడుకగొల్పు తావి స
ర్వత్ర నుతింపనౌను రఘురామ దయాహృదయా శుభోదయా. ౬౩

ఉ. ఈమహి సత్యధర్మముల నెన్నికసేయఁగలేరు సుమ్మికన్
గామునిబోలు మేటివిలుకాఁడును సోముని బోలుదాత ను
త్రాముని బోలుభోగి వరదా నినుబోలినరాజు జానకీ
రామునిబోలునాతి రఘురామ దయాహృదయా శుభోదయా. ౬౪

చం. నిజభుజశక్తిచేతను గణించు ధనంబు భుజించు టుత్తమం
బు జనకు నార్జితంపుధనముల్ భుజియించుట మధ్యమంబు భ్రా
తృజనులవిత్తముం దినుటయే యధమంబగు నంగనాధన
వ్రజమధమాధమంబు రఘురామ దయాహృదయా శుభోదయా. ౬౫

చం. తమకులవిద్యచేత నుచితంబుగ జీవనముల్ రచించు టు
త్తమమగు నర్థకంబును పదంపడి కర్షణమూనుచుంట మ
ధ్యమమగు సేవకత్వ మధమాశ్యమగుం గడునింద్యమాటః జౌ
ర్యము నొనరింపరాదు రఘురామ దయాహృదయాశుభోదయా. ౬౬

ఉ. సాహసముల్ సుబుద్ధియును శక్తియు ధైర్యపరాక్రమంబు లు
త్సాహమునందనర్చు గుణషట్కము నెవ్వనిఁబాయకుండు స
ర్వాహములందు నమ్మనుజునందు ముకుందుఁడు నిల్చి సర్వని
ర్వాహకదృష్టిగల్గి రఘురామ దయాహృదయా శుభోదయా. ౬౭

ఉ. పోనివి రెండు నింద యశముల్ నరుబొందిన పిమ్మటల్ సదా
పూనిక రెండు వచ్చుచును బోవుచునుండును గల్మిలేములే
మానక పోయినన్ మఱల మానము ప్రాణము మానవాళికిన్
రానివిరెండునమ్ము రఘురామ దయాహృదయా శుభోదయా. ౬౮

ఉ. ఇమ్మహిలోన నెన్నఁగ మహీదివిజక్షత్రియంబు రాజయు
గ్మమ్మును వైశ్యులేవురును గాఁ బదజాతచతుష్టయంబు వి
శ్వమ్ముగఁగూడుకొంచు నొకకాలమునందుఁ బ్రయాణమూని కా
ర్యమ్మునకేఁగరాదు రఘురామ దయాహృదయాశుభోదయా.

ఉ. తృప్తి వెసంగు బ్రాహ్మణుఁడు తృప్తి దనర్చని క్షత్రియుండు ల
జ్జాప్తి వెసంగకుండు గణికాంగన సిబ్బితి గల్గి ధర్మ్యసే
వాప్తి జెలంగుచుండెడు కులాంగనయున్ సతతంబు భద్రసం
ప్రాప్తి నిగాంచుచుండ్రు రఘురామ దయాహృదయా శుభోదయా.

చ. నిగమము మూలమౌను ధరణీసురపాళికిఁ బత్ని మూలమై
తగును నికేతనంబునకు ధాన్యసమృద్ధికి మూలమౌఁ దలం
పఁగఁ గృషి లోకమంతకును భాసిలు ద్రవ్యము మూలమౌఁ దలి
ర్పఁగనని యార్యులండ్రు రఘురామ దయాహృదయా శుభోదయా.

ఉ. లేదనుమీ కృషిక్రియ దలిర్చెడువానికి గర్వ్యాకప్పుడున్
లేదనుమీ యఘంబు జపలీనమనస్కునకుం బరిశాంతిచే
లేదనుమీ వివాద మొకలేశమునైనను జాగ్రదున్నతిన్
రాదనుమీ భయంబు రఘురామ దయాహృదయా శుభోదయా.

చ. సకలగుణాఢ్యుఁడౌసుతుఁడు చాలునొకండె గుణాల్పులైన పు
త్రకులిఁక నూర్వురేల సముదంచిత పూర్ణతగల్గుచందురుం
డొకరుఁడె చాలు లోకము సముజ్జ్వలతన్ విలసిల్లఁజేయఁ దా
రకలిఁక పెక్కులేల రఘురామ దయాహృదయా శుభోదయా.

చ. పరులస్వభావముం దెలిసి పల్కెడిచోఁ బ్రకృతోపయుక్త వా
క్స్ఫురణము నాత్మశక్తి కనుకూలముగా నభిమానమున్ మహ
త్తరమగు ధర్మవర్తన విధానమెఱుంగునతండె సూనె నే
ర్పరి యగుపండితుండు రఘురామ దయాహృదయా శుభోదయా.

ఉ. క్రమ్మినరప్పు వల్వరుస గప్పినకప్పు సమస్తసంపదా
ప్తమ్మగు ముప్పు వేగ సులభంబుగఁ దీరినయప్పు వర్ణధ
ర్మమ్మున నిల్పుచొప్పు సవరంబునఁ గూర్చిన జారుకొప్పు దో
రమ్ముగ నొప్పునంద్రు రఘురామ దయాహృదయా శుభోదయా.

చం. క్షితిమనుజాళికెల్లఁ బరికింపఁగ నాలుగువిద్యలేసుమీ
చతురత నభ్యసించినఁ బొసంగవు పుట్టుకతోన రానగున్
వితరణకౌశలంబు సుకవిత్వపటుత్వ మవార్యమైన శూ
రతయును గానశక్తి రఘురామ దయాహృదయా శుభోదయా.

చం. ప్రమద యొనర్చుదుష్కృతపరంపరఁ దత్పతి బొందు శిష్యబృం
దము రచియించునట్టి దురితంబును దద్గురువొందు రాజ పా
పము బొరయుంబురోహితుఁడు బాటిలురాష్ట్రకృతాఘమున్ క్షమా
రమణుఁడు బొందునుమ్మ రఘురామ దయాహృదయా శుభోదయా.

చం. సమధికరూపవంతులును సత్కులసంభవులయ్యు విద్యలే
శమును నెఱుంగకున్న నరజన్మలు ఖ్యాతివహింపకుంద్రు ని
క్కముగ నదెట్టులన్నను సుగంధవిహీన పలాశపుష్పవా
రముకరణిం దలంప రఘురామ దయాహృదయా శుభోదయా. ౬౭

చం. తమయుదకంబులన్నదులు త్రావవు స్వీయఫలంబు లెల్లవృ
క్షములుభుజింప వభ్రములు సస్యములం దిన వట్లుగా మహో
త్తమ పురుషార్జితంబయిన ద్రవ్యమహర్నిశమున్ బరోపకా
రమునకెయౌనుసుమ్ము రఘురామ దయాహృదయా శుభోదయా. ౬౮

ఉ. ఇచ్చకొలంది దానొరుల కిచ్చెడిపట్టున నన్యుచేతఁ దా
బుచ్చుకొనంగనౌతజిని బూనియొనర్చు పరోపకారమం
దచ్చగజాగుసేయు నరునంటు నభాగ్యత శీఘ్రుకారికిం
గ్రచ్చులుగల్గుచుండు రఘురామ దయాహృదయా శుభోదయా.

ఉ. అర్థమెరుంగఁజాలని నరాధములెల్లను బద్యముల్ వినో
దార్థముగాఁబఠింతు రదియంతయు లోకమునందు నెయ్యెడన్
వ్యర్థము నమ్మదెట్టులన భక్తియొకించుక లేక దేవునిన్
బ్రార్థనసేయుమాడ్కి రఘురామ దయాహృదయా శుభోదయా. ౨౧

ఉ. సారముగల్గు నేల జిగిచాలిన నేతఁ జెలంగుచేల చె
న్నారుననురూప సద్గుణములబ్బిన బాల జనాళికిన్ సుభో
ద్ధారకమైనశాల విబుధస్తుతుఁడౌ ప్రభులీల స్తోత్రి ని
ద్ధారణనొప్పఁజాల రఘురామ దయాహృదయా శుభోదయా. ౨౨

చ. వడిసమరీతిగాఁగురియు వాన ప్రసూనఫలానవద్యమై
యడరెడుకోన రత్నముల కందముదేర్చెడి సాన శత్రులం
బొడిచినసేన వల్లభుని బూజలఁదన్పిన చాన కీర్తి నే
ర్పడఁగను ధాత్రిలోన రఘురామ దయాహృదయా శుభోదయా.

చం. ఘనులగునట్టి వారలకుఁ గాంక్షలిడన్ ఘనులేసమర్థులై
చనుదురు నీచులెప్పుడును జాఁరు గట్లనిదాఘ దాహమె
ల్లను నణగింపఁ జేయఁగ బలాహకముల్ తగుగాని యట్లొన
ర్ప సమేలుగావునమ్మ రఘురామదయాహృదయాశుభోదయా. ౨౪

ఉ. స్వాదువులైనపుత్రవరభాషితముల్ వినకున్నహానియా
బ్రోదిగమున్ హిరణ్యకశిపుండు తనూభవుఁడైనయట్టి ప్ర
హ్లాదునిసూక్తులన్ వినక యాపద నొందడె క్రూరమైనదు
ర్వాదములన్ రచించి రఘురామ దయాహృదయా శుభోదయా. ౧౫

ఉ. పాదపకోటిలో నమరపాదపమున్ దివిజాళిలోన దా
మోదరుఁడున్ విహంగమసమూహములోపల రాజహంస కా
కోదరరాజిలోపల మహోరగరాజును నాయుధాళిలో
హ్రాదిని ఖ్యాతినొందు రఘురామదయాహృదయా శుభోదయా. ౧౬

చం. పొదలెను నీదుకీర్తి పరిపూర్ణశశాంకగిరీశ కాశ చా
రదదరకుందహీరఫణిరాట్ఘనసారవియన్నదీశర
న్మృదిరసుధారసద్యుష దనోకహతారశతారహారపా
రదసదృశత్వమొంది రఘురామ దయాహృదయా శుభోదయా ౧౭

చం. అతిబలవంతుఁడైనను మహాధనశాలియు నైన న్యాయప
ద్ధతిని నటింపకున్నను బదంపడి గీడొనగూరుఁ దొల్లి ధ
ర్మతనయు భాగమీయక దురంబున నోడెనుయోధనుండు క్రూ
రతరమనస్కుఁడౌచు రఘురామదయాహృదయా శుభోదయా. ౧౮

చం. పలుకెచట్టన్ వచించినను భానురలీలనమోఘమౌచు శో
భిలు నచటన్ వచింపదఁగు వేరొకచో వచియింపనేల స
త్ఫలదపునేల విత్తనమునై చిన వర్ధిలు నూషరోర్విఁ జే
రలనిడ నెట్లు మొల్చు రఘురామదయాహృదయాశుభోదయా. ౧౯

ఉ. బాలకుఁడెంత తెల్విగలవాఁడయినన్ గురు వాదరించి ను
శ్రీ లలరంగ శిక్ష నొనరింపుచు నేర్పకయున్న విద్యరాఁ
జాల దదెట్టులన్న మణిశాణవిలీఢము గాక కాంతి ధా
రాళత నెట్లుగాంచు రఘురామదయాహృదయా శుభోదయా. ౯౦

ఉ. ఈవసుధాస్థలిన్ శ్వశురుని ల్లతిసౌఖ్యద మెల్లవారికిన్
వాకిరిగా జనార్దనుఁ డభంగురతుంగతరంగ సంగతం
బైవిలసిల్లునట్టి కలశాబ్ధిఁ బరుండె హిమాద్రియందు దు
ర్గావిభుఁడ త్తమిల్లె రఘురాము దయాహృదయా శుభోదయా. ౯౧

ఉ. పెల్లుగనెల్లయప్డు బకబృందము లున్నసరోవరంబు రా
జిల్లదు హంసమొండు నివసించిన శోభిలు నోలగంబు రం
జిల్లను బండితుండొకఁడు జేరినవట్లు ప్రకాశమొందునే
ప్రల్లదు లెందరున్న రఘురామదయాహృదయా శుభోదయా. ౯౨

ఉ. ద్వేషముగల్గియున్న నతితీవ్రశశోక్తులతోడ సాధులన్
దూషణసేయఁగాఁ జనదు తొల్లను చైద్యుఁడు సేగి బాల్యడెన్
రోషముతోడఁ గృష్ణుని విరుద్ధముగాఁ గ నచింపరాని దు
ర్భాషలనిందజేసి రఘురామదయాహృదయా శుభోదయా. ౯౩

చం. అతివకు నాథుఁ డేపురుషుఁ డౌటకు ధాత విధించి యుండె నా
నతఁ డెయొరుండుగాడు దమయంతిస్వయంవరవేళ సర్వదే
వతలును గోరివచ్చినను వారిని మాని నలున్ వరించెఁబూ
జ్ఞతరముఖంబుతోడ రఘురామదయాహృదయా శుభోదయా. ౯౪

చం. పలువురుసాటిగాదనుచుఁ బల్కనకార్యమొనర్చి సేని సెం
జెలిఁబొరయించు రావణుఁడు సీతను దోడ్కొనిపోయి సోదరా
దులు వ లదన్నమానకతిదుశ్చరితుండయి తావకాస్త్రధా
రలహతుఁడయ్యె మున్ను రఘురామదయాహృదయా శుభోదయా. ౯౫

చం. వితరణశాలికీర్తి కవిబృందముచేతఁ బ్రసిద్ధినొందు న
ట్లితరులచేతనొంద నెదిరెట్లనీసర సుమసౌరభంబుమా
రుతమున వ్యాప్తమౌ మధువుఁగ్రోలి చరించెడు మత్తబంభర
ప్రతతులచేతనౌనె రఘురామదయాహృదయా శుభోదయా. ౯౬

చం. తనకు విపత్పరంపరలు దార్కొనుపట్టునఁ బుత్రులాప్తులున్
వనరుచునున్న వానిని నివారణ సేయఁగలేరు సారసం
బునకుఁ దుషారజాతమగు మోసము మాన్పఁగఁ జాలిరే విక
ర్తనవిధిముఖ్యులున్న రఘురామదయాహృదయా శుభోదయా. ౯౭

ఉ. కాలవశంబునం బొరయు కష్టసుఖాళికిఁ గారణంబులై
ప్రేలును పూర్వకర్మములు వీనినిఁ ద్వత్పదభక్తి ద్రోయు వా
తూలము గీష్మకాలమునఁ దుంగమహీరుహ జీర్ణపర్ణముల్
ప్రాలఁగఁ జేయునట్లు రఘురామదయాహృదయా శుభోదయా. ౯౮

ఉ. ఎట్టి మనుష్యుఁడైన మఱి యే పనులందు మెలంగుచున్న నె
ప్పట్టున నాత్మమానసము పంకజనాభ భవత్పదాబ్జముల్
పట్టి మిళింపమట్టు లెడబాయక యుండు నతండు ధన్యుఁడై
రెట్టడి సౌఖ్యమొందు రఘురామ దయాహృదయా శుభోదయా ౯౯.

ఉ. కామ్యములందు రోసి కినుకం బెడబాసి మదంబు ద్రోసి స
త్సౌమ్యత దాసి భూతహిత సమ్మతభావనఁ జేసి దుష్క్రియా
గమ్యపథంబు మాసి నిజకర్మములం దెగఁ గోసినట్టి శ్రీ
రమ్యుఁ డెసుమ్ము యోగి రఘురామ దయాహృదయా శుభోదయా ౧౦౦

ఉ. మంగళమర్కసూనుహిత మంగళమంగజ కోటిసుందరా
మంగళమార్యవర్యనుత మంగళమాసుర గర్వసంహరా
మంగళ మాశ్రితావన సమాదర మంగళమయ్య నీకొగిన్
రంగుగ మంగళంబు రఘురామ దయాహృదయా శుభోదయా. ౧౦౧

ఉ. మేలుగఁ బీరికాపుర సమీపగతోత్తర దిఙ్మహీస్థలిన్
నాలుగు క్రోసులందు గణనంబగు మానము నందునున్న చే
బ్రోలుపురంబునన్ శతకమున్ రచియించితిఁ బంక్తికంఠ జై
త్రాలలితో గ్రహింపు రఘురామ దయాహృదయా శుభోదయా ౧౦౨

మ. అవనీమండలి శాలివాహన శకాబ్దానేకముల్ భారతీ
ధవశుభ్రాంశు గజేందు సంఖ్యలను దెంపన్ హేమలంబ్యబ్ద మొ
ప్ప నరుం డల్లనురాజవంశ్యమణి సుబ్రహ్మణ్య సంజ్ఞాక స
త్కావికిం బుత్రుఁడు రంగశాయికవి వేడ్కం జెప్పె నీపద్యముల్.

రఘురామశతకము సమాప్తము.

---

## అల్లమరాజు రంగశాయికవి
## పూర్తిచేసిన సమస్యలు.

సమస్య. తునిలోఁ బెనుగొండ భయముతో డాఁగె జుమీ.

పూర్తి. క. అనిమిషపతి వజ్రాయుధ
మును గైకొని శైలపక్షముల విచ్ఛేదం
బొనరింపఁగను సరిస్వం
తునిలోఁ బెనుగొండ భయముతో డాఁగెజుమీ. ౧

సమస్య. తలలోనే యిమిడియుండెఁ దత్వంబెల్లన్.

పూర్తి. క. వెలయఁగ నాల్గు వేదం
బులు మీమాంసాది శాస్త్రములును పురాణం
బులు చదువఁగ భగవద్గీ
తలలోనే యిమిడి యుండెఁ దత్వంబెల్లన్. ౨

సమస్య. యమ మందిరమునకు నరిగి రతిహర్షమునన్

పూర్తి. క. పద్మములు పళ్ళెములను హ
స్తములందు ధరించి నడువ జననీజనకుల్
కొమరునిఁ దోడ్కొని యపుడుప
యమ మందిరమునకు నరిగి రతి హర్షమునన్. 3

సమస్య. సూర్యోదయవేళయందుఁ జుక్కలు పొడిచెన్

పూర్తి. క. ఆర్యులు నచ్చెదరిఁ కశుభ
కార్యమున కటంచు నగుచు గడపలలికి సౌం

దర్యా మలర సున్నముతో
సూర్యోదయ వేళ యందుఁ జుక్కలు వొడిచెన్. ౪

సమస్య. అక్కా యని పట్టుకొనియె నాలి కుచంబుల్.

పూర్తి. క. చక్కని గృహమున దీపము
దక్కమిఁ బతి రతికి నతి నతనువుఁ దపముచున్
మక్కువతో నిద్యాది నీ
యక్కా యని పట్టుకొనియె నాలి కుచంబుల్. ౫

సమస్య. కలిఁబూని వధించె శత్రుగణముల నెల్లన్.

పూర్తి. క. లలనామణి రుక్మిణికై
ఖలులగు శిశుపాలముఖులు కలహ మొనర్పన్
బలరాముఁడు హలమును రో
కలిఁబూని వధించె శత్రుగణముల నెల్లన్. ౬

సమస్య. మూగవాఁ డప్డు షట్ఛాస్త్రములఁ బఠించె.

పూర్తి. గీ. వేదశాస్త్రంబులను జదివికొని విప్ర
బాలుఁ డొకరుఁడు నృప సభాభ్యంతరమునఁ
జొచ్చి యుండఁగ వింతతోఁ జూచి జనులు
మూఁగ వాఁ డప్డు షట్ఛాస్త్రములఁ బఠించె. ౭

సమస్య. జగమే జగమును వహించె సౌకర్యముగాన్

పూర్తి. క. నగములును వరాహం బ
ష్టగజములును కచ్ఛపంపు స్వామియు నైరిం

పంగ లేకున్నను శేషుభు
జగమే జగమును వహించె సౌకర్యముగాన్ ౮

సమస్య కందులకున్ జెక్కు లాదవి కానల కెగిరెన్.

పూ_ర్తి. క. అందమగు చిలుక పిల్లలఁ
గొందఱు మానవులు పట్టికొని పెంచుచు నం
దుం దలఁచి యుంచ నవు డా
కందులకున్ జెక్కు లాదవి కానల కెగిరెన్. ౯

సమస్య. సింహము కాల్ నక్కు గఱచెఁ జిత్రము గాఁగన్,

పూ_ర్తి. క. అంహస్కరులగు చోరుల
సంహార మొనర్ప రాత్రి జనుఁడు పొలములో
సింహముగఁ జఱవఁ బూరుషు
సింహము కాల్ నక్కు గఱచెఁ జిత్రము గాఁగన్. ౧౦

సమస్య. కరములతో సంచరించె గగనమునందున్.

పూ_ర్తి క. గరుడుం డాహారమునకు
ధరలోఁ బుట్టలను వెదకి తన పదములతో
దొరకొనిన యట్టి దర్వీ
కరములతో సంచరించె గగనము నందున్. ౧౧

సమస్య. చీఁకునకు దివ్యదృష్టి చేకూరె వెసన్.

పూ_ర్తి. క. ఆకురుపతి సభఁ గుపితుం
డై కృష్ణుఁడు విశ్వరూప మగుపఱచు తఱిన్

శీఘ్రకర ధృతరాష్ట్రుండును
చీఁకునకున్ దివ్యదృష్టి చేకూఱ వెసన్. ౧౨

సమస్య. హాయ మాఁకలిచేత నైదు హస్తులఁ గూల్చెన్,

పూర్తి. క. రయమున శంకరుఁడును గౌ
రియును గిరాతాకృతుల ధరించికొని హిమా
లయమునఁ గరుగఁగఁ బార్వతి
హాయ మాఁకలిచేత నైదు హస్తులఁ గూల్చెన్. ౧౩

సమస్య. గంగానది మేఘు మగుచుఁ గడు వర్షించెన్.

పూర్తి. క. భంగములేకుండఁగ ద్విజ
పుంగవులు మఖంబుసేయఁ బూనుచు హోమం
బుం గావించిన పొగ పెరు
గంగా నది మేఘు మగుచుఁ గడు వర్షించెన్. ౧౪

సమస్య. సరియగు నీలోత్పలంబు సరి గా కుండెన్.

పూర్తి. క. విరిబోఁడి కన్ను దోయికి
నెర విందంబులును మరుశరావళి యౌ సరిం
బొరయఁగఁ దగు చుండెను సాగ
సరియగు నీలోత్పలంబు సరి గాకుండెన్. ౧౫

సమస్య. బంగరుమేడమీద నొక భామిని వ్యాఘ్రముఁ జూచి భీతిలెన్.

పూర్తి. ఉ. రంగుగఁ జిత్రకారకుఁడు రత్నశిలాకను చేతఁ బూని యు
త్తుంగ సువర్ణ హర్మ్యమున దూకొని యచ్చటి గోడలందు సా

రంగములం దురంగముల వ్యాఘ్రములన్ లిఖియింప నప్పు డా
బంగరుమేడమీద నొక భామిని వ్యాఘ్రముఁ జూచి భీతిలెన్.

సమస్య. శునకమ్ములు పువ్వు లయ్యె శోభ వహింపన్.

పూర్తి. క. వనితలఁ బురుషుల మోహిం
ప నొనర్చుట కిక్షుధనువుఁ బట్టి జగములం
బెన గొనుచున్నట్టి రతీ
శున కమ్ములు పువ్వు లయ్యె శోభ వహింపన్. ౧౭

సమస్య. రత్నము కాళ్ళతో నడచి రాజు కుఱంగటకేఁగె వింతగన్.

పూర్తి. ఉ. ప్రత్ననవీనులౌభటులు రాజవరేంద్రసుతాంఘ్రి హస్తముల్
నూత్నపు ఖడ్గజాలమున నొవ్వఁగఁద్రుంపఁగ యోగిపుంగవుల్
యత్నముతోడఁ బ్రోచి రుచిరాంగునిజేయఁగనన్నృపాత్మభూ
రత్నము కాళ్ళతో నడచి రాజు కుఱంగటకేఁగె వింతగన్ ౧౮

సమస్య. బువ్వ దినాంతమునఁ బెద్ద భూతం బయ్యెన్.

పూర్తి. క. నవ్వుచు రమించు చెలువుఁడు
దవ్వగుదేశమునకేఁగఁ దా విరహిణియై
నివ్వటిలు సఖికి వేల్పుల
బువ్వ దినాంతమునఁ బెద్ద భూతం బయ్యెన్. ౧౯

సమస్య॥ కంఠీరవకంఠమందుఁ గరి యుదయించెన్॥

పూర్తి. క. కుంఠితులై వేల్పులు పటు
కంఠరుతిన్ శివుని వేఁడ గరళము నతఁడు

త్కాంతను మ్రింగఁగఁ దత్సుర
కంఠీరవకంఠమందుఁ గరి యుదయించెన్. ౨౦

సమస్య. రాతిరి యుత్తరమునందు రవి యుదయించెన్.

పూర్తి. క. నీ తెలివిఁ జెప్ప నేటికిఁ
జాతఫలంబులకుఁ బనుప సాక్ప్రాతి విఁక ని
ద్రాతిశయమణఁచు గడఁచెను
రాతిరి యుత్తరము నందు రవి యుదయించెన్. ౨౧

సమస్య. కోతికిఁ బిల్లి పుట్టి కరికూనను మ్రింగెను గాకికైపడిన్.

పూర్తి. ఉ. ఆతతవార్ధి యెవ్వనికి నయ్యెను గుల్యగ నెద్ది మూషక
వ్రాతవిరోధి యెయ్యది తరంగిణిదాఁటగ సాధనంబగున్
మేఁతకు నేమిసల్పె హరి మేల్ పిక మెట్లుగనుండు హన్మయన్
కోతికిఁ బిల్లి పుట్టి కరికూనను మ్రింగెను గాకికైపడిన్. ౨౨

సమస్య. చందనమున శిరసుమాడఁ జలువను గోరెన్.

పూర్తి. క. క్రందుగఁ దీక్షాతపమున
నెందునువృక్షములు లేనియెడ ఖర్వాటుం
డొందుచును విగళితంబగు
చందనమున శిరసుమాడఁ జలువను గోరెన్. ౨౩

సమస్య. వ్రజపుటుంగరముఁ దెచ్చి వనితకొసంగెన్.

పూర్తి. క. ద్విజసముఁడైన రమణుఁడు
ప్రజాహ్వయ యోగయుక్తవాసరమునఁ దా

వజ్రితకాంతియుతంబగు।
వజ్రపుటుంగరముఁ దెచ్చి వనితకొసంగెన్. ౨౪

సమస్య. సంరక్షణ సేయుమయ్య సర్వేశ హరీ.

పూర్తి. క. సంరంభముతోడను సా
యంరాత్రిందివములందు నచ్యుత దాసో
హంరక్షయాశు భక్తుని
సంరణసేయుమయ్య సర్వేశహరీ. ౨౫

సమస్య. స్వప్నములోనైన హరిని సంసేవింతున్.

పూర్తి. క. ప్రాపోస్మి త్వాం శరణం
తృప్నుహి మా మిందిరాపతేయనిసాధు
క్షిప్నులసఖ్యమొనర్పక।
స్వప్నములోనైన హరిని సంసేవింతున్. ౨౬

సమస్య. ప్రాఙ్నగమధ్యభాగమున భానుఁడుగ్రుంకె నిదేమిచిత్రమో.

పూర్తి. ఉ. దిజ్నికరంబునందు మణిదీధితు లొక్కటమొగిన్ గడల్కొనన్
స్రజ్నిచయంబుసూర్యుఁడునుచంద్రుఁడులోనగుభూషణంబులన్
వాఙ్నయమొప్పఁ బట్టి తలపై విభుఁ డుంచఁగఁ దత్సతీస్తన
ప్రాఙ్నగమధ్యభాగమున భానుఁడుగ్రుంకె నిదేమిచిత్రమో ౨౭

సమస్య. ఘనుపాలిచ్చి సుఖింపఁజేసె రతిలోఁ జంద్రాస్య ప్రాణేశునిన్

పూర్తి.మ. వనజాతాస్త్రునిఁబోలు వల్లభునితో వ్యామోహమ్ముం బొందుచుం।

డీవరైనూత్నపధూటి శయ్యాపయిఁ గ్రీడింపందో:డంగ ద్రపా।
ప్తిని మేనంతయుఁ జూపలేక సారిదిక దేహంబులో నగ్గమై
చనుపాలిచ్చి సుఖింపఁజేసె రతిలోఁజంద్రాస్య ప్రాణేశునిన్

సమస్య. గోముఖవ్యాఘ్రమువంటివారు తగవామగువా మగవారి నమ్మటల్

పూ ర్తి. ఉ. శీఘ్రముగాను నీసదనసీమకు వచ్చెద మంచుఁబుష్పసం।
జిఘ్రిమధువ్రతంబు వలెఁ జెంతకుఁ జేరుచు మాయలన్ నదీ।
భాగ్ఘ్రిదమట్లు డెందములు బొటిలమాటలనంద్రు గోముఖ।
వ్యాఘ్రిమువంటివారగు తగవామగువామగవారి నమ్మటల్.

సమస్య. సతిసతిగనయంగఁ బుత్రసంతతి గలిగెన్.

పూ ర్తి క. దితిజుఁడగు తారకాసురుఁ।
డతిబాధ లొనర్ప వాని నణఁచెడివానిన్
సుతుఁగనుటకుఁ గైలాసవ
సతి సతి గనయంగఁ బుత్రసంతతి గలిగెన్ 30

సమస్య. కుచములు పురుషునకువచ్చెఁ గోమలికిఁబలెన్.

పూ ర్తి. క. సుచతురపురుషుఁడు వనితయుఁ
బ్రచురపుగజనిమ్మపండ్ల రాశినిఁగొని తె
చ్చి చెలిసగముబంచుకొన లి
కుచములు పురుషునకు వచ్చెఁ గోమలికిఁ బలెన్ 31

---

## సంస్కృత సమస్యా.

తాతోపి పీతాయతే.

---

పూర్తి. శ్లో. క్షీరాంభోధి తరంగశీకరరుచా కాకోపి హంసాయతే
కాళిందీతటినీజలైస్తు కలయన్ హంసోపి కాకాయతే
సంధ్యారాగసమాకులోగిరి వరో మేరుక్షితిభ్రాయతే
గౌరీలిప్తహరిద్రియా జ్వలనభూతాతోపి పీతాయతే. ౧

---

## తెనుఁగుసమస్య

భరతునిఁ జంపె రాఘవుఁడు భామినికై సురకోటి మెచ్చఁగాన్

పూర్తి. చం. పరుషవచః పరంపరలు పల్కుచు సాధు జనాళికెప్పుడున్
గరమును బాధఁ జేయుచును గార్ముకమున్ ధరియించి సర్వభూ
వరుల జయించినట్టిఁడగు పంక్తిగళున్ బరయోషిదాళిలా
భరతునిఁ జంపె రాఘవుఁడు భామినికై సురకోటి మెచ్చఁగాన్

సమస్య. ఘునిఁ గని సూపకారుఁ డని తోయజనేత్రి మదిన్ముదంపడెన్

పూర్తి. చం. తన పతి దూరదేశమునఁ డాల్కొనియుండఁగనంతఁగంతు వే
దనలను బొందుచున్నదయి దైవము మున్ సశరీరుఁడైన యా
వనజశరున్ వధించతివి నందనమయ్యె యటంచు భూతనా
ఘునిఁ గని సూపకారుఁడని తోయజనేత్రి మదిన్ముదంపడెన్

సమస్య. నలుగురి యంగవైభవ మనాథుల కొప్పె ననంగయోగమై.

పూర్తి. చం. జల మొక యించుకైనను బొసంగఁగ నీయక తీక్ష్ణమైన యెం
డలు పరిబలించి కాయఁగ జనంబులు ఘోషిల తామడాంబరం
బలవడి యున్న యట్టి సమయంబున దైనబలంబుచేతవా
నలుగురి యంగవైభవ మనాథుల కొప్పె ననంగయోగమై. ౪

శ్రీ శ్రీ శ్రీ



MANORAMA] FRESS, RAJAHMUNDRY.

